మదినిమ్మళించి-యుద్ధమునకురమ్మనిసతాయించి - రావ
ణాసురుఁడుచాలదుఃఖించి- మెల్ల మెల్ల నేలంక కేతెంచి॥
ఓ శారదాకరుణానిధీ॥ ౧౩౧

ఉండి॥ రావణాసురుడుకొలువైకూర్చుండి - మనసులో
చాలచింతింపుచుండి-దగ్గిరున్నట్టిమంత్రులపుడుండి- మన
యింతేసిబంట్రోతులుండి-యేటకనిశంకనొందకుండండి-
కొదువలేదుబెగ్గిలిజడియకుండి- జాగ్రతదప్పిరుచూడం
డి- కట్టినట్టిసదుములువిప్పకండి- మనలంకలోయిట్లుచా
టండి-కుంభకర్ణుణ్ణివేగలేపండి రెండువేలరాక్షసులువె
ళ్లండి-పొండివెళ్లండిలేపుకొనిరండి-యనఁగవెళ్లి దగ్గిరను
గూర్చుండి నడ్డజరచిబొబ్బలువెట్టుచుండ- తెరవలేనినిద్రా
రచేతనుండి-కదలకుంటెనుయేనుగులుతెండి- తెచ్చినారు
లేమట్టింపుచుండి-ఊగవాలెనసివా త్రగ్గిలుమండి- లండివే
గసీసముగాచితెండి- తెండిచెవులోనబట్టిపోయండి॥ ఓ
శారదాకరుణానిధీ॥ ౧౩౨

లేచి॥ కుంభకర్ణుండువేవేగలేచి - చురచురగవారిపై
జూచి- కోపగించుచునున్నట్టివలయూచి- వారిపయికట్టి
చారలూజూచి-రావణాసురుండపుడువిచ్చేసి-కుంభకర్ణు
నిముఖమపుడుజూచి - బల్కెవాక్యంబుమదనూహ జేసి॥
ఓ శారదాకరుణానిధీ॥ ౧౩౩

అంగ॥ రావణాసురుఁడుమదినిసుపొంగ- కుంభకర్ణు
ణ్ణిచాలపొగడంగ-కుంభకర్ణుండుమాటవినంగ- రామ
చంద్రునితోవాదుసేయంగ- ఓపలేముభూజాతనొసగం
గ-రామచంద్రునకుమోదమలరంగ- స్నేహమునసుండ

పోయిసౌఖ్యంగ-కుంభకర్ణుఁడుబోధసేయంగ-రావ
ణాసురుఁడుకోపగించంగ-లేచినాఁడయ్యకొండోయనం
గ-వానరులపైనిభూమియదలంగ-గడవవకోటబురుజు
దాటంగ-దిగ్గజములుగడగడవణకంగ- వాయువీరనుచువి
భజనేరుగంగ- మీరకనుపట్టుకొనిబ్రమింగంగ - వానరులు
జూచివేగబాగడంగ - పారిపోయిరిమొగుడోయనంగ॥
ఔశారదాకరుణానిధీ॥ ౧౩౪

సర్వ॥ సుగ్రీవుండుమదికాకసర్వ-కూకలేబెట్టిబలము
పురికొలిపి- ఝుడియకనుతానుమదిదెల్పినిల్పి॥ఔశారదా
కరుణానిధీ॥ ౧౩౫

అదను॥కుంభకర్ణుఁడుబ్రహ్మాండవదన-డైపల్కెనిక
పించమణచెదను-చూడుమేలైననాచేతిగదను- వానరుల
బట్టినురుముజేసెదను-బాహుబలముయీవేళఁజూపెదను-
రామలక్ష్మణులవేగత్రింగెదను- మూఁడులోకాలుహాత
ముజేసెదమ॥ఔశారదాకరుణానిధీ॥ ౧౩౬

తాను॥ కుంభకర్ణుఁడుమదికాకతోను - శ్రీరాముతె
దీటునునిల్వగాను-రామచంద్రుండుమదికాకతోను- ఎవ్వ
డవురసీవనియడుగగాను - తగణమోర్చితెపేరుజెప్పెద
ను-ఎఱుగవింకనానుహిమలెల్లాను - గంధర్వకిన్నరులెల్లా
ను-చేతిగదచేతయుడలగొట్టాను-వినరయేనేవభువనాల
లోను-నిలువలేరుయుద్ధమునఁనాతోను - జిక్కెనాథ,రానా
చేతిలోను-నీకునాయుస్సుసరినేడతోను- నీప్రాణముల్బ
చ్చుకొంటాను- 'యద్భుతంబైననాచేతిగదను- యవుడు
భూమిగడగడవణకేగాను - కుంభకర్ణుఁడువేగగదతో

ను-బొమ్మసిల్లి రాముడంతలోను- తెలివినొందె భీకరరూ
పుతోను॥ఔ శార దాకరుణానిధీ॥ ౧౩౭

దెబ్బ॥ వేసినావు రాచావాటు దెబ్బ- ఇంక జూడరానా
పక్కని దెబ్బ- సీకుతగిలేటి వేగనీయ దెబ్బ- మడియ జేతునని రా
ముండుని దెబ్బ-రంబుతోడుత సువాడుత బ్బిదెబ్బ॥ఔ శార॥

కోపం ॥ జనియించె శ్రీరాములకు కోపం- చాలబడ్డాడు
రాక్షసుని రూపం -ధూళిజేసి దేయిక నాకు శాపం - లేదు
యింతేసితిట్లుసల్లాపం - లంక కెల్ల పుడుర్ఘుం బైనదీపం-
కుంభకర్ణుడుండు వీరప్రతాపం- బడచి వేసెను నరసింహ
రూపం-బవ్రుడు రావణాసురుడు విక్షేపం-పడుచున్నా
డుకోపసంతాపం॥ఔ శార దాకరుణానిధీ॥ ౧౩౯

మొరసె॥ దేవదుందుభులు దివినుండి మొరసె-పుడమిపై
నిపుష్పాలవానగురిసె- లంకపొంకమీవేళతోవిరసె- రామ
చంద్రుండు కరుణతో మెరసె- పాయకున్నాడు లక్ష్మణుని
మొరసె-మోదమలరంగ యతని ముఖమరసె - సంతోషం
బుతో చాలమొరసె॥యూ శారదాకరుణానిధీ॥ ౧౪౦

తాను॥ రావణాసురుఁడు యతిచింతతోను- అడలుచును
చాలశోకించగాను - యతికాయుండు బల్కెనటు తాను-
చింతసేయక ధైర్యంబుతోను-వినుము నేనొక్కమాట జె
ప్పెను - రామచంద్రునితో యుద్ధంబు మాను- భూజాతని
ముత్వరగాను - లోకనాథుండు రాముడనగాను - యం
త రావణుఁడు బల్కెపుడు తాను - స్వామియని యెరుగకు
న్నాను కాను- సీతలోకమాతని తెలిసినాను- యతనిబాణ

ములచేజచ్చి నేను•ముక్తిగలదనుచు నాసపడ్డాను అయినసె
లవిమ్మునాకుత్వరగాను- వెళ్లి వానరులనొక ఘడియలోను-
కొట్టిహతముగావించివచ్చెదను - రణభేరిధంధణంమ్రో
యగాను-కిరీటంబుబల్ రాపాడగాను-మూఁడులోకాలు
భీతిల్లగాను॥యాశారదాకరుణానిధీ॥ ౧౪౧

మేలు॥ అతికాయుఁడెక్కినరథమువీలు- బంఘ్రుచుండె
పండ్రెండుద్వారాలు-మేలయినవజ్రపుకిటాలు-యూణి
ముయ్యాలుదగుతోరణాలు- వీరుబారులకొశల్వ్యటద్దాలు-
ఇంపుసొంపైనకెంపుఛత్రాలు - నింపుగుల్కునీలపుచామ
రాలు-కంపమొందేటినీలిజెండాలు-పూచెపండ్రెండుజో
ళ్లగుర్రాలు-రథముపైనగూర్చున్నయావీలు- కొండలను
బోలురెండుటెక్కాలు•లెక్కలేనట్టియేనుముత్తాలు - ఎ
టుజూచినామందిగుత్తాలు- అర్బుదముసిర్బుదములాయు
ధాలు-ఝుంఝుణకతాయనుచు భేరీలు-ఘూర్ణిల్లంగనం
కునాదాలు-రామచంద్రుండుజూచెచిత్రాలు-విభీషణా
భళిమేలుమేలు - మీయన్నగారొచ్చెగాబోలుపల్కెనిట్లు
శ్రీరామభూపాలు॥యాశారదాకరుణానిధీ॥ ౧౪౨

ఉండు॥ పల్కెనావేళవిభీషణుండు-రావణుడుగాదుచి
త్తగింపుండు-ధాన్యమాలిగన్నట్టిపుత్రుండు- సాహసుం
డుమేలైనశూరుండు-వానినామంబెయతికాయుండు- పే
రుతగుననేరామచంద్రుండు-మనముజాగత్తబడుదాము
లెండు॥యాశారదాకరుణానిధీ॥ * ౧౪౩

నవ్వి॥ యతికాయుండుమీసంబుదువ్వి- జూచితలయూ

చిపట్టెనోయివ్వి-ధంబునామంచియాయుధాలెవ్వి-లెం
డివానరులపెంటంతత్రవ్వి - వైతురామలక్ష్మణులుబలు
క్రొవ్వి-యుండువారుమంచిదితలట్రెవ్వి- వేతుననిచాల
క్రోధంబుత్రవ్వి॥ యా శారదాకరుణానిధీ॥ ౧౪౪
ధీరా॥ స్వాంతులారవాకపివీరులార-వచ్చినాఁడిదిగో
యతికాయశూర-వీనితోడబెసమముగాఁబోర-మీరెవ్వ
రైననునోపలేర-నాదయోగ్య్వపట్టగ్గమెల్లధార- పోతునని
శబ్దంబుమీర-పల్కుచున్నట్టిసమయమునబోర- బాణముల
కోర్వలేకనురబార-రామచంద్రుండుమదికాకమీర- పిరి
కితనమునను పారిపోతార-నిల్వనిల్వవశధైర్యంబుమీర-
రామచంద్రునకునడ్డమైదూర- లక్ష్మణుడునిల్చె భళిమేరు
ధీర॥యా శారదాకరుణానిధీ॥ ౧౪౫

అంత॥ శూరుడైనట్టిలక్ష్మణుండంత- రామచంద్రునె
దుటనునిల్చెనంత-వింటిబాణంబుఁబూనినాఁడంత- యతి
కాయుండుబల్కినాఁడంత - భయముమానివచ్చెదవునా
చెంత-తొలుగుతొలుగుమనికూకలేసంత- చూచి తేనునా
యంగుష్ఠమంత-లేవుపోవోయియనుమాటచెంత-సామ్య
మెరుగవామటికొండయంత-దానిమీదపడిమెడిపిడుగెం
త - నిన్నుతునకలుగచెందుతానంత-బాణజాలంబువదిలి
నాడంత-యపుడుగడగడవణకె భూమంత॥యా శారదా
కరుణానిధీ॥ ౧౪౬

అంచి॥అతికాయుండుచాలకోపించి-చేతవిల్లపుడుతా
నుసంధించి- వేవేగనారినిసవరించి- బాణవర్షంబుచాల
గురిపించి - లక్ష్మణుఁడుచాలవిభ్రాంతిమించి - యోర్చలే

డామెదెబ్బలుభరించి - లక్ష్మణునిజాలభీతినొందించి ॥ ఔశారదాకరుణానిధీ॥ ౧౪౭॥

అట్టి॥ అపుడులక్ష్మణునకుగ్రంబుబుట్టి- పట్టినసివేగవి ల్లెక్కు బెట్టి- దెబ్బతోటబైవానిపడగొట్టి- వానిరథమెల్ల తునకలుగగొట్టి- వానిసారథినిమున్నెపడగొట్టి- రెండు బాణాలగుఱ్ఱాలగొట్టి - ధూళిగాజేసికినుకచెపట్టి॥ ఔ శారదాకరుణానిధీ॥ ౧౪౮॥

మేలు॥రుధిరంబుచేతనుతూర్గ్యాలు-తునకలైయు న్న యట్టియశ్వాలు- లెక్కలేనట్టివేస్తుతుండాలు- గండు డైనయట్టియరదాలు - విరిగిపోయియున్నట్టిఫాలు- బద్దలైవాగనట్టిభేరిలు [illegible] దగనుబో లు-ఇట్టు లున్నావిర[illegible]ములెల్ల॥ ఔ [illegible]రుణా॥

అట్టి ॥ చావగామి[illegible]కపవునిట్టి [illegible] కొలువున్నయట్టి-[illegible]కూటమునమదిబు[illegible] త్రాంతంబుసగుప[illegible]ట్టి - రావణాసురుడు[illegible] బుట్టి- యింద్రజి[illegible]రఫుడెబెట్టి- ఇంద్ర[illegible] డంబుబెట్టి-నన్నువేగ[illegible]షించిన[illegible] కనియడిగినట్టి-సమయమ[illegible]ట్టి- మనం గుతుందన్నకోపంబుబుట్టి-ఇంద్రజిత్తుమసంబునసెట్టి- యొక్కదెబ్బతోనందరినిగొట్టి-వేతునవిభీకవంబయినట్టి- మాటలకునుసంతోషంబుబుట్టి- పూంగ్వమునవాయుపుత్రు ణ్ణిబట్టి- తెచ్చినాడనుచుమదినాసబుట్టి॥ ఔశారదాకరు॥

వావా॥ ఆదిలోనేనాతోజెప్పరాదా - యిందస్తువా సింతైనలేదా- యొక్కదెబ్బతోగొట్టుమనైకాదా- శ్రీ

యెంతపనియనుచునామీద- నాప్రజ్ఞ ముందుగజూడరా
దా-యనుకొనుచపుడుమదిలోనబీద- పడుచునెక్కెనప్పు
డుతాతేరుమీద॥ ఓ శారదాకరుణానిధీ॥ ౧౫౧॥

వెళ్లె॥ ఇంద్రజిత్తుండుపైనమైవెళ్లె- రావణాసురుని
భాగ్యంబుమళ్లె-లంకలోయుండిపోయినవియిళ్లె- గ్రద్ద
లేషూగుచున్నలోగిళ్లె- పురుషవర్షమైనవిపెంకుటిళ్లె-
వీడుమేఘాల చాయకే వెళ్లె-చేతబటుకొన్నాడయ్యావిల్లె
కొట్టమొదలెట్టెతారకలుడుళ్లె-కొట్టుజాగజల్లెడరీతికళ్లె
యిపుడుశ్రీరామచంద్రులవాడల్లె॥ ఓ శారదాకరుణాని॥

వాడు ॥ అదుగోమేఘాలచాయనున్నాడు- బాణము
లుచాలవేయుచున్నాడు ఘాతమంటేయక్కడకాన
రాడు-నిలువకుండంగగొట్టుచున్నాడు-దొంగయుద్ధంబు
జేయుచున్నాడు- ఇదియేమోయియీవింతనేడు - య
నుచురామచంద్రుడుబల్కెనాడు॥ ఓ శారదాకరుణా॥

మేలు॥ కుప్పతెప్పలుగయిట్లుబాణాలు- తెరిపిలేకుండ
దివినుండిరాలు- ఉరగమగునట్టిపిడుగులయితూలు- యు
ద్ధమీవేళతోచాలుచాలు - యనిపించెరాఘవశరీరాలు-
యుండిపోయెరావట్టిశల్యాలు- శహభాసురాభళిమేలు
మేలు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౧౫౪॥

అంచి॥ ఇంద్రజిత్తుండుచాలమోదించి- నాగాస్త్రము
ప్పుడుప్రయోగించి-బాణజాలంబునపుడుసంధించి- సర్వ
సేనంతమూర్ఛగావించి- యంతగరుడణ్ణివేగరావించి-
మూర్ఛదేలింపమరియుసంధించి- మూర్ఛముంపంగాల
క్ష్మణునిగావించి-అంతజాంబవంతుడూహించి- వా

యుప్రతుగ్రిణ్ణిచాలమదినెంచి-ఔషధములుదెమ్మనుచుబం
పంచి-వాయువేగంబుతోడజనుదెంచి- యోషధులుబట్టు
కొనుచుజనుదెంచి-సర్వసేనపైవేగజల్లించి-క్షణములో
వారిమూర్ఛవెడలించి-కోటిసూర్యులట్లుగప్రకాశించి-ప
రగజంపుటకుబుద్ధినూహించి॥ ఔ శారదాకరుణానిధీ॥

అట్టి॥ రామచంద్రుండుమదిచింతబుట్టి - ఇంద్రజిత్తు
ణ్ణివేగంబెదొట్టి-సాధనంబేమియనియడిగినట్టి- సమయ
మునవిభీషణుండుమనసుబుట్టి-వానిగుట్టెల్లతాబయలుబె
ట్టి-చెప్పినయవ్యపథ్యాగ్నిగండ్లుబుట్టి-నిద్రాహారములులేని
యట్టి- వానిచేగానిచావకున్నట్టి- భాగ్యమునవరముదె
చ్చుకొన్నట్టి-వృత్తాంతంబునగుపరచెనట్టి-సమయమున
నుసంతోషంబుబుట్టి లక్ష్మణుండుమీసంబుపెనబెట్టి- గట్టి
గానపుడుశబ్దంబుబుట్టి॥ ఔ శారదాకరుణానిధీ॥ ౧౫౬॥

జూచి॥ రామచంద్రుండులక్ష్మణునిజూచి-నాడునేనిచ్చు
ఫలముదినివేసి- నాథ,యనగానెదొడచీరివేసి-రామచం
ద్రునకుయగుపరచివేసి గెల్వగలడనుచుమదినూహజేసి-
లక్ష్మణుండపుడుపిల్లెగరవేసి - ఇంద్రజిత్తుతోననికపుడు
వాసి- ఒక్కగడియట్టియుద్ధంబుజేసి-యద్భుతంబుగాత
లద్రుంచివేసి॥ ఔ శారదాకరుణానిధీ॥ ౧౫౭॥

అంచె॥ రావణాసురుండుచాలకోపించె- భీయంచున
న్నుమసాహసించె-మూలబలమంతవేగరప్పించె - లంక
లోనపుడువేగజాటించె- గవారిబట్టుమునవచించె-
సకలశస్త్రముల్రథముపైనుంచె - వాయువేగమునరథ
ముదోలించె-యుద్ధసన్నద్ధులైయేగుదెంచె- విల్లుబూచే

బూనిలనిహుంకరించెగుభులుమనుచురణభేరివేయించెశ
క్తిబాణమప్పుడుప్రయోగించె - భూమియాకాశమంతు
బాగనించెరౌద్రరూపమ్మునను మేగుదెంచె-హనుమంతు
డప్పుడుపారుదెంచె-బట్టిమునుకతోవచ్చిఖండించె-తున
కలయియొక్క-తునకేగుదెంచె-లక్ష్మణునిబట్టిమూర్ఛగా
వించె-భీతిచేప్రాణముల్ చంచలించె- రామచంద్రుండు
ధైర్యమెడలించె॥ఔశారదాకరుణానిధీ॥ ౧౫౮॥

ఆమె॥ పుడమియంతచీకటిగప్పిపోయె-లక్ష్మణుఁడు
భూతలశయనుడాయె-రామచంద్రుండుదుఃఖస్థుడాయె
వానరులంతదీనముఖులాయె - రామచంద్రునకుచాలభ
యమాయె-పక్షిమృగములేమేతలేమాయె॥ఔశారదా॥

మెచ॥ రామచంద్రుండులక్ష్మణునిజూచి- ధైర్యమెడ
లున్నముఖమెట్టచూచి-నీవంటితమ్ముణ్ణేచాసి- యోర్వ
రాదాయెనీచింతజేసి- తొల్లియిట్టిఘాతెవ్వరికిజేసి- నా
ముగాళోలుదైవమిటుజేసి నాశనీయకైకనుగవనుమూ
సి॥ఔశారదాకరుణానిధీ॥ ౧౬౦॥

నేను॥నిన్నుయెడబాసినిమిషమైనాను-యుండలేనోయి
తమ్ముడానేను- సకలమైనట్టిసౌఖ్యంబులాను-విడచిపెట్టి
నాతోడకూడాను-వచ్చిపదునాల్గుయేండ్లు డవిలోను- ని
దురభుక్తులులేకుండగాను- యతిభక్తితోడుతమమ్ములా
ను-కొలిచియిప్పుడీయుద్ధంబులోను-రావణుండేయశక్తి
చేతాను-పడిపోతివేమిసేయుదూను- అయోధ్యకొక్క
తిరుగాను-పోవలేనోయినినువిడచితేను-పోవగాజూచి

నన్నడగితేను- ఏమిజెప్పుదునుసుమిత్రతోను- గానియిప్పు
డెనీతోఁగూడాను - ఇదుగోవచ్చెదనుజూడుమత్వరగాను॥
ఓ శారదాకరుణానిధీ॥ ౧౬౧॥

వ్రాత॥ ఓయితమ్ముడాలక్ష్మణభ్రాత - వదలవలసె
రా నేడుసాకేత- పిలచితేపలుకవేమెందుచేత - చేసితె
గానునీకేమి ఘాత-నామీదగోపంబెంక చేత. దైవమీలా
గుపన్నెనాఘాత-నీవులేకున్ననాకేలసీత- తఃముగానట్టి
దుఃఖంబుచేత-మంచిమేలయినశస్త్రంబుచేత- పొడచు
కోఁబోవగానేతరువాత-జాంబవంతుండువిడిపించె సంకే-
ఘాలమునవ్రాసెనీరీతిధాత॥ ఓ శారదాకరుణానిధీ॥

ఏమి॥ పిలచితేపలుకకున్నావదేమి- రామలక్ష్మణులు
యనుమాటభూమి- పైనవికలంబుజేసినావేమి- మీరంద
రిటుదుఃఖపడుటేమి - యనుచుమమ్ములనునూరార్చవే
మి-తాళలేనోయియింకనాకేమి-బుద్ధిజెప్పుమని కోపించె
స్వామి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౧౬౩॥

ఏలా॥ నీవులేనియీభాగ్యంబులేలా- రథములేలయీగు
ఱ్ఱంబులేల-యీణెముత్యాలపేరులింకేల- యనుచ తీసివే
సెనుస్వామినేల- ఏమిసేతునిక వేయిచేల జన్మాల- నీవం
టితమ్మునిగానజాల- యనుచు రామభూపాలుఁడావేళ॥
ఓ శారదాకరుణానిధీ॥ ౧౬౪॥

ఇంచి॥ రాముడనుజునిమోము వీక్షించి-రామచంద్రుం
డుచాలదుఃఖించి-యున్నజాంబవంతుండుమదినెంచి-శ్రీ
రాముదుఃఖము నివారించి • మేణుసితోఁడసపడ ఞా

షించి- ఇట్లు బలుకంగ జూచియూహించి॥ ఔ శారదాక॥

అపుడు॥ సుషేణునితోడనన్నాఁడు- మనలనేలినవాడు రాముండు-రాముఁతోఁడబుట్టినలక్ష్మణుండు-రావణునిశక్తిచేత బడినాడు-సమరభూమిపైబడియుండెజూడు -నీసాటియైనట్టివైద్యుండు-మూఁడులోకాలయందునాలేఁడు॥ ఔ శారదాకరుణానిధీ॥ ౧౬౬॥

నీవు॥ రామచంద్రుని గొలిచి యున్నావు - ఈయాపదవీక్షించినావు-వీక్షించినీవూరకున్నావు - యిట్లుతగదయ్యావేవేగనీవు- లక్ష్మణునిధాతువాగిజూచినావు - తగినటువంటియౌషధంబీవు-ఇచ్చిబ్రతికించిరామచేనీవు-చాలబహుమానములుబొందునీవు॥ ఔ శారదాకరుణానిధీ॥

అట్టి॥ ఆవచనంబులెల్ల చెవిబెట్టి - లక్ష్మణునిచేయితాచేతబట్టి-యతనినాడియాడుటకసపెట్టి- సౌమిత్రికీప్రియమైనయట్టి - లక్ష్మణునిమోమున్నయట్టి- శుభలక్షణాంబులుచేతబట్టి- వినగపల్కెనుమోదంబుపుట్టి॥ ఔ శారద కరుణానిధీ॥ ౧౬౭॥

అనెను॥ సుగ్రీవునితోడనిట్లనెను-సౌమిత్రికికొదువలేదనెను- సంజీవినగమ్ము దెమ్మనెను- ఆమాటకునుసుగ్రీవుడనెను-పవననందనునిముఖమట్టనెను॥ ఔ శారదాకరు॥

అంత॥ నీవురావోయివీరహనుమంత- ధైర్యవంతుఁడవుశౌర్యహనుమంత-బృందారకాస్థిరబుద్ధిమంత - యీరాక్షసులపాలిటికృతాంత- యీపనినీకుగావించుటెం

త ॥ఓ శారదాకరుణానిధీ॥                    ౧౬౯॥

దండ॥ యీరేయి తెల్లవారుచుండ- దనుజకులనీతితిమి రమూతొాండ-నీవుదేగలవుసంజీవికొండ - పద్మబాంధ వుండుదయించకుండ-రావయ్యావానరసువేదండ- యన గసుగ్రీవుడనగనాదండ ॥ఓ శారదాకరుణానిధీ॥౧౭౦॥

అనెను॥ వాయుపుత్రుండుమటిమంచిదనెను- శ్రీరాము లకుప్రణమిల్లితాను-హనుమంతుండుసంభ్రమముతోను- నట్లుగావించెగడుశీఘ్రముననును- వినువీధికేగవేడ్కతో ను-ఇట్లేగుచుండగతోవలోను-కాలనేమిదైత్యుండుకప టమునను-మౌనిరూపమైయడవిలోపలను - వాడనగా నెహనుమంతునకును- చాలదాహమైననువానితోను-దా హశాంతియుగావించుమనెను॥ ఓ శారదాకరుణానిధీ॥

ఇంచి॥ కాలనేమియుదానుచ్ఛ్రయించి-కాసారంబు నొకటిజూపించి-తానున్నాడువాలగ్వించి- వాయుపు త్రుండుకొలనుదిగిమంచియుకకంబుతాదొసిటనుముంచి పుచ్చుకొనబోవనందులోనుంచి- పెద్దమొసలొకటివచ్చి లంఘించి-హనుమంతుణ్ణిబట్టికబళించి-చెరువులోనుంచి కడుసంభ్రమించి॥ఓ శారదాకరుణానిధీ॥                    ౧౭౧॥

వాడు ॥ అపుడాహనుమయిటుచేసినాడు- దానికుం డలేపెకలించినాడు - గోళ్లతో జీరిసమయించినాడు- తృణప్రాయముగజయముగొన్నాడు-తనచాపంబుదీ చుకొన్నాడు-కాలనేమినితాజూచినాడు -యుక్తిదె బ్బచేతనుద్రుంచినాడు అచ్చోటనుంచియు కదలినాడు-

సంజీవికొండయు జూచినాడు-పిలువద్రోణగెకూకలువేసి
సివాడు॥ఓశారదాకరుణానిధీ॥ ౧౭౩॥

కొండ ॥ ఔనేయోసంజీవికొండ - లక్ష్మణుండిప్రుడు
మూర్ఛచేనుండ-నీదగ్గిరనుసంజీవియుండ- తెమ్మనిబంపె
రామచంద్రుండ-వచ్చినాను నేవాయుపుత్రుండ-నిట్లుస్తో
త్రంబులేజెయుచుండ-కొండయూరకుండెనుపల్కకుండ
హనుమంతునికికోపంబునిండ- భూమికంపమొందంగనా
కొండ॥యాశారదాకరుణానిధి॥ ౧౭౪॥

అట్టి॥ అట్టితోకతోడుతచుట్టబెట్టి- హనుమంతునికికో
పంబుబుట్టి - నెత్తిబెట్టుకొనితాపరుగుబెట్టి-వచ్చుచుండ
గాగైకేయిపట్టి-బ్రహ్మాస్త్రంబు కెంగేలబట్టి - నారిగూ
చినంతటబ్రహ్మపట్టి-వాయుపుత్రుండితడుకోపముట్టి-
ఓర్చుమనవేగభాస్కరునిపట్టి-సర్వసేనలునుజూచుచున్న
ట్టి-సమయంబునగేసరిపట్టియైనహనుమంతురాకకసిపె
ట్టి-సూర్యోదనుచునునొకభయముబుట్టి- యప్రుడువేవేగ
విల్లెక్కుబెట్టి-రామచంద్రుండు మొదలైనయట్టి - ఉద
యించినాడనికోపముట్టి-రామచంద్రుడువిల్లెక్కుబెట్టి,
కొట్టుటకునూహజెయుచున్నట్టి - సమయమునజాంబ
వంతుడన్నట్టి-బుద్ధిమంతుడప్రుడుశాంతిబెట్టి॥ ఓశార
దాకరుణానిధీ॥ ౧౭౫॥

వచ్చె॥హనుమంతుండుసంజీవితెచ్చె - రామచంద్రుని
చేతికందిచ్చె- పట్టగాలక్ష్మణునకెతెలివొచ్చె.కోటిసూ
ర్యప్రకాశంబుహెచ్చె-వాయుజునిరామచంద్రుండుమె
చ్చె- కోరినటువంటివరములప్రుడిచ్చె, రావణాసురుడు

యిటు మోసబుచ్చె- ననుచునందరికిరోపంబువచ్చె- యుద్ధమునకప్పుడు రాక్షసుఁడువచ్చె॥ ఓ శారదాకరుణాని॥

ఆమె॥ శ్రీరాములకుసంతోషమాయె- నా కోర్కె- నేటికిసఫలమాయె-లక్ష్మణుండప్పుడుజన్మునఁడాయె - నేటితోకమఁడపరిపక్వమాయె- నా కార్యమిప్పుడుజయంబాయె- రాక్షసులకులంకయుబాసిపోయె - రావణునిపొట్టక్రొవ్వణఁగిపోయె-లంకపాడాయమునకుసాధ్యమాయె-ననుచుయుద్ధసన్నద్ధుడప్పుడాయె ॥ నా శారదాకరుణానిధీ॥

ఎంచి॥ శుకసారణులువేగుదెంచి- భక్తిమీరంగరావణునిగాంచి- హస్తయుగ్మములెనుదుటముకుళించి- లక్ష్మణుఁడులేచెననివిన్నవించి- అంతదశముఖుడుబహువిచారించి- మీదకార్యమెట్లనుచునూహించి- తనభార్యనప్పుడువెళ్లి గాంచి-శత్రువులవలనకార్యంబుమించి-వచ్చెననిచాలకన్నీరునించి॥ యా శారదాకరుణానిధీ॥  ౧౭౮॥

మేలా॥ ఇప్పుడింతవిచారించనేల- మించుకార్యంబునకుగుందనేల-సీతనప్పించుమనిబహువిధాల- మున్నుజెప్పితేవినకపెడచెవుల-బెట్టితికనైకనామాటలాల- కించిజానకినినీవుయీవేళ-వినయమెప్పంగరామభూపాల - శేఖరునకిచ్చిశరణంబెచాల- వేడుకొనుమతడుకరుణాలవాల హృదయుడౌటచెనిన్నునవలీల - బ్రోచునీకింతసందేహమేల- యటుగాకుంటెమునినైవనాల- తపముగావించుమటియాశలేల-యనుచుమండోదరనగనావేళ॥ శా

వినుము ॥ నేనొకటిజెప్పెదగనుంగొనుము- సీతనిచ్చు టకునాదు నెమ్మనము- ఒప్పజాలమయీమాటనిజము-గా ననీమనమునసమ్మికొనుము- కానకుంబోయి నేనిప్పుడుత పము- సేయగాజూచినవ్వదేజగము- వారలందరునన్నె ఘుసము- సేయరికయుద్ధమిప్పుడు సమ్మదము- గనుకభార్గ వునికడకు వేగిరము - ముందుతెరపడుగజనియెదనువిను ము॥ యాశారదాకరుణానిధీ॥ ౧౮౦॥

ఏగి॥ జేశకునిజూతుననుచు చెలరేగి - రావణుండప్పుడు వేగమున నేగి- శిష్యవర్గంబుచుట్టునను మూగి-యున్నశు క్రునకు మ్రొక్కంగసాగి - చరణములహస్తముల చేతసా గి-పట్టుకొని కావవేయనుచుసాగి - కంటనీరు చేతనుతా నుచూగి- దుఃఖవహ్నిచేతలోనగాగి యుండగాంజూచి యోగీంద్రభోగి- వైనసికిప్పుడెమి రానేగి- యనుచువాని తోననియెనా యోగి॥ యాశారదాకరుణానిధీ॥ ౧౮౧॥

తాను॥ రావణుండనియె భార్గవునితోను-దండకార ణ్యమునువనములోను - రామలక్ష్మణులువైదేహితోను- మౌనిమైవారువసియించగాను- సీతలక్షణంబులువిన్నా ను-దానిపైబుద్ధిపదయింపగాను-సన్వడేయచ్చటికివెళ్లి నాను-మాయచే దానిచెరదెచ్చినాను - యంతలోవారు సుగ్రీవుతోన-సఖ్యమొనరించుకొనియుండగాను-సూర్య పుత్రుండువానరులతోను- భూపుత్రికనుపెతకమన్నాను- వానరులుదిక్కులకునుబోవగాను - అంతలోవేగమునవా యుసూను- డబ్ధిలంఘించిమనలంకలోను-యున్నసీతతో భాషించగాను- వనములోవృక్షములుబొంకితేను ,చూచి

రాక్షసులు బెదరించగాను-పోకవాండ్ల సందర జంపి తేను-
వాని దెప్పించి కట్టించినాను- లంక ముట్టించి తాను త్వరగా
ను-పోయి యా రామలక్ష్మణులతోను-సీత శుభవార్తలను జె
ప్పగాను-వార్ధిఁ గట్టించుకొని యంతలోను- లెక్కలేనట్టి
కపిసేనతోను-రామలక్ష్మణులు నలంకలోను- చుట్టుము
ట్టుకొని వారుండగాను-దానవులకోటి నేపంపగాను- వా
రికేసి వీరికిని జోడుగాను - ఘోరముగ యుద్ధమాయెనాలో
ను॥ యా శారదా కరుణాధీ॥ ౧౮౩॥

అన్యడు॥ ఖడ్గరోముండు కడతేరినాడు-వజ్రదంష్ట్రుడు
పడిపోయినాడు-శూలహస్తుండు తా సోలినాడు-సారణు
డు ముందుగా జచ్చినాడు-నిగ్నుద్రహంతకుడీల్గినాడు-కుం
భకర్ణుండు తా గూలినాడు - ధూమ్రాక్షుండు తా గూ
లినాడు- ప్రహస్తుండు పడిపోయినాడు-మకరనేత్రుండు
తా వడిసినాడు- అక్షయుండాదిసే యణగినాడు- ఇంద్ర
జిత్తుండు తా నేగినాడు-లంకలో యింక ధీరుండు లేడు-తో
చక సురారావణుడు వచ్చినాడు - వీని కేదైన యొకత్రోవ జూ
డు-యనగ భాగ్యవంతుడు బలుకుచున్నాడు॥ యా శారదా॥

ఓని॥ నీకు బుద్ధి జెప్పెదను వినరోరి-నీవు బ్రహ్మ వరదర్పము
న మీరి- దేవతుల నెల్ల బాధింపవారి- ప్రార్థనల చేత యి
పుడు దైత్యారి-రామచంద్రుడై జనియించెనోరి- దశర
థాత్మజుడు దుష్టసంహారి-యతని పట్టంబు దేవియో నారి
సీతయై బుట్టినది నీకుమారి- దాని చే లంక చెడు సిద్ధమోరి-భ
క్తిచే రామచంద్రుల వారి-పాదపద్మములకు శరణుదూ

రిసీతనర్పించుటదిమేలురోరి॥యాశారదాకరుణానిధీ॥

వాడు॥మీరు జెప్పినది కార్యంబుగాదు- దేవతలకెల్లనా
మాటమీము- నరునిజేరంగనేనెట్లబోము- కొద్దిపనిసేయ
నాకిచ్చలేదు. సకలలోకములనపకీర్తిబోదు. సీతపైబు
ద్ధియికనెల్లిపోదు-యింకకాకున్నదదికాకపోము- పట్టిన
దివిడుచుటయునీతికాదు- రామలక్ష్మణులనిర్జించినాదు
కోర్కెకోసరమ్మనియెనాజోదు॥ యాశారదాకరుణా॥

ఎంచె॥ వానిమూర్ఖత్వమునకు కోపించె- వీనిసిరిద
ప్పెననివిచారించె-వానిబ్రతుకుకై యొక్కటూహించె-
రావణాసురునిమోముపీక్షించె. నేనుచెప్పినదివినుబుద్ధి
మంచె- అనుచుశుక్రుడిట్లనుచు దీవించె- నేలమాన్యమ్మొక
టియుదర్పించె- దానిలో వేదికలునుకల్పించె. దానిచుట్టి
యూపములుపాతించె-వన్నెమృగములన్నియు దెప్పించె-
గ్రామ్యపశువులన్నింటిదెప్పించె. వాటినాగియూపముల
కుగట్టించె-వృక్ష జాతములనెల్లగొట్టించె-వాటసమిధల
నుచుట్టునింపించె-నాజ్యకుంభంబులాచుట్టునించె- రక్త
ఖాండంబులచటనుంపించెయున్నకొద్దిసాంబ్రాణిదెప్పిం
చె-నందులోగుగ్గిలముకూడనుంచె - తేనెలోపలనూలు
తడిపించె-తామ్రపాత్రములోననుంపించె-యాఘనూనె
దీపములబెట్టించె సకలఫలపుష్పములుసంగ్రహించె-సక
లధాన్యరాసులుపోయించె-శత్రువులువచ్చిదీనిభంగించె
పోవకుండంగకాపులుంపించె- నీవురక్తవస్త్రమునుధరిం
చె.రక్తగంధలేపనముగావించె-వేదికకుపశ్చిమమునవసి

చె- శత్రుజయయుక్తియపుడునూహించె- రుద్రభూమి
లోవన్నిఁ గప్పించె- దానివేదిలోపలనుప్రణయించె రక్తసి
క్తదర్భలుపరిధులుంచె- యాగమోక్తాగ్నిముఖముగావిం
చె- అసిసూత్రకములచేనుంచె- మంత్రవర్ణంబులపుడు
విభజించె- సాధ్యసమాక్షరములఘటియించె - పశువుల
న్నిటినియపుడు వేధించె- వర్ణాలతు హోమంబుగావించె-
రక్తప్రాణాహుతియు జేయించె- యష్టమంత్రదేవతల
ప్రార్థించె- నుండగానిన్నుసదియు కరుణించె యంగలోవే
దికామధ్యనుంచె- రథము శాశ్వతముగా గబంపించె- దాని
చేనీకువిజయమిప్పించె- బ్రోచుమని జెప్పగానాలించె నా
సేంద్రుండు వేడ్కతో మించె- గురుప్రసాదమ్మునిక్కలంక
లేతెంచె॥ శ్రీశారదాకరుణాసిద్ధీ॥ ౧౨౬॥

తాను॥ భృత్యవర్గములబిలుపించగాను - వాండ్లుభీతి
చేతను జేరగాను- హోమసంభారములువరుసగాను- లక్ష్మ
ణ్రాయించి తెమ్మనంగాను- అంతలో వారు తెప్పించగాను
జూచిహర్షించిభూబిలములోను - వాటనుంపించితాను
త్వరగాను- సచటుగార్చ్చుచుండీకమభక్తితోను- శుక్రుడానతి
చ్చినరీతిగాను- నిష చేవ్రేలుచుచుండగాను అంతలోసనత్వ
దృతముగాను ధూమరాసులప్పుడు బుట్టగాను ప్రళయ
కాలాంతక మొయసంగాను సకలదిశలెల్ల వ్యాపించగా
ను అపుడుబ్రహ్మాండభాండంబులోను- తెల్ల బోయిచీకటి
గప్పవాను- సూర్యచంద్రాదులణగిపోగాను- మేదియు
నుకానరాపోక తేనువరికేదితోచకయుండగానుఅపుడు

శ్రీరామచంద్రులతోను కపులుదీనిసంగతి జెప్పగాను - అట్లువీక్షించి బెదరితోడుతను రావణానుజునిబిలుపించగాను యతఁడు చెంగటనునిలిచియుండగానుదీనివృత్తాంతమెల్లద్వరగాను - యున్నదున్నట్లుగా జెప్పగాను హోరామ ఖింక కానివ్వకుండాను - విఘ్నమొనరింపవలయుననగాను అపుడంగదుఁడు వానరులతోను అందుకై రాఘవుడు బంపగాను॥యీ శారదాకరుణానిధి॥ ౧౮౭॥

వారు॥ రామమూర్తికిమ్రొక్కియువారు కోట్లకోట్లగై కూడుకొన్నారు కేవుమని కేకవేయుచున్నారు యంతరిక్షము నకపుడెగసినారు వారువేగమునపరుగెత్తినారులంకలోకపుడులంఘించినారు సౌధములకెక్కిపడవేసినారు-దివ్యభవనములుపడగొట్టినారు మంటపములెల్ల మట్టేసినారు కోట్లలోకపుడుచొరబారినారు రత్నసంఘములువిరజల్లినారు చిత్రవస్త్రములనుచించినారు వంటసాలకువడివెళ్లినారు యచటనున్నవారిని మోదినారు భక్ష్యభోజ్యాదులనుమెక్కినారు మారుమారనుచుబలుకుచున్నారు దానవులనెల్ల పడగొట్టినారు రాక్షసస్త్రీలపడికరచినారు బాలవృద్ధులను బెదరించినారు యేనుగాబినుగులజేసినారు యశ్వములుభస్మములు జేసినారు యచటగగ్గోలుబెట్టించినారు యంతలోవనములకు నెగసినారు పుష్పవాటికలుపెకలించినారు యెల్లచో రావణునివెదకినారు కానరాకున్నయోచించినారు యంతలోసరమనటుజూచినారు వారిలోవారుబలుకుచున్నారు॥ యీశా

శారదాకరుణానిధీ॥ ౧౮౮

ఓరి ॥ యెవ్వతెయొగాని సుందరాకారి పొగడతరము
గాదురమనోహారి దీనికురులింద్రనీల మణులోరి నుదురు
నెలచందురుని బోలురోరి మోముపరి పూర్ణశశిబింబ
మోరి చూపులల మన్మథునితూపులోరి బొమలు శింగిణీ
విండ్లుగదరోరి ముక్కుచక్కదన మక్కజంబోరి మోవి
దొండపండనగపగునోరి దీనిపలువరుసమౌక్తికములోరి
పల్కులా తేనియల్ జిల్కునోరి తళుకుచెక్కులు దర్పణ
ములోరి గళముతీరెన్నగాదరమురోరి దీనికుచములుగా
కుచములోరి బాహువులుదిద్దిన ట్లున్నవోరి చిన్నిహస్త
ములు విగురాకురోరి మగువనడుమెన్నగా ఘనమురోరి దజ
ఘనంబుసైకతంబోరి శుభంబూరువులు గనరంభలోరి
పాదములుపద్మములగేరునోరి గోరులాచారుతారకము
లోరి దివ్యసుంగళాకృతియుగనరోరి రాజ్యలక్ష్మిలాగు
న్నదిగదరోరి రాక్షసాంగనయుగాదుగదరోరి రామరా

మయనుచునామెదరిజేరి - నాట్లగిరియామెదయగోరి ॥
యాశారదాకరుణానిధి॥ ౧౮౯॥

అఠా ॥ యెంతపుణ్యాత్మురాలవోయమ్మ నిన్నుజూడ
శ్రమమణగెనోయమ్మ మనసులోచింతబాసెనోయమ్మ రా
ముకార్యార్థమైవస్తిమమ్మ అలవిభీషణామలు బంపిర
మ్మయొక్కమనవాలకించవోయమ్మ రావణుండెచటనుం
డునోయమ్మ జెప్పితేనీకుబహుపుణ్యమమ్మ శాశ్వతైశ్వ
ర్యములుగలుగునమ్మ . పుడమిలోకీర్తిబొందెదవుసుమ్మ

పాటు తపఃఖండనవశము గాదన్న గనుకత్వరగాను సెలవి య్యవలెనమ్మ యనఁగ నాదికిట్లనియె నాకొమ్మ॥యాశారదా॥

మరో॥ రాఘవులు బంపి తేవచ్చినారో మీకు తోచియుచ టికివచ్చినారో నిజము దెలియుటకు సన్నడగినారో లేక యాశ్చర్యము సడిగినారో శావగారేమి జేయుచున్నా రో లంకలోనెంక లేకుండినారో ఇందుని పైయుద్ధమునకే గినారో హవ్యవాహనుని పైగవసినారో దండధరుని పై దండెత్తినారో కోనపతి పైన కోపించినారో లేక కోటె త్తిగా వెళ్లినారో మూఁడులోకాల నేలుచున్నారో లింగ పూజాంతరంగులైనారో యీపర్వతము క్రిందనున్నా రో మోహమంత్రమే సలుపుచున్నారో నాకు తెలియదీ కయిటుజూచుకోరో॥యాశారదాకరుణానిధీ॥ ౧౯౧॥

కండి॥ ఈమె జెప్పినదినిజమానుసుండి మీరు చెదరిపోక సుకూడుకొండి కొండదగ్గరకు బోవలెపదండి యనుచు వాగలప్పుడు బల్కుచుండె నెలబిలము పైకొండజూడండి- దాని పెకళించి పారవేయండి లెండి లెండనుచు యాకొండ పిండి జేసి యాబిలద్వారంబునుండి లోపలికబోవగా కొం డనుండి యయినరాక్షసులనెల్ల నుచెండి రండిరండనుచు బొరబారుచుండి దండిగామండుయామోహముగుండి లో నస్వాహాయని వేల్చుచుండి ప్రళయకాలాగ్నియగన డగి యుండి సాంబశివ పాహియని పల్కుచుండి రావణుండె వినిగనుగొండె పారిపోగలఁడు పోనియ్యకండి కాపులున్న దానవులగొట్టండె యనుచు గపులచ్చటికి జేరియుండి॥ యా

స్త్రీలుపాటపాడంగ చిత్తగింపుచునుతాను నుండంగ -
ఛత్రశోకమునబాగలుచుండంగ వరదలయికంటినీరులా
లుకంగ యిట్లుభోరుమనియేడ్చుచుండంగ॥యాశారదా॥

ఔ రా॥ ఇంద్రజిత్తుండానను జూడరారా వైరదర్పా
పహారసగర్ధీర బాహుశరనిర్జితశునాసీర నిన్నుజూడక
నునేచుంపిలేర వ్వప్నమందయినకానరావేరఅంతలోచి
కటులుగప్పెనేర తండ్రికాలోచనను జెప్పరార దీనులము
నమ్మునగిద జేర్చుకోరమమ్ము విడనాడిపోవుటదిమేర మార
సుకుమారకార్తుయకుమార కంటపడవేమిరారాకుమార
యన్నతోగూడినాయన్నరార పాలుపోసెదనునాబాబు
రార మోదమలరంగముద్దిచ్చిపోర యేచటనున్నారనుచు
వెదకవోర యెక్కడయిన దక్కగపోయినార మాతోడ
ననుదీసికొనిపోర యెటుభరియింతునోపుత్రులార దుఃఖ
సాగరమునేదాటలేర యనుచు గోలుమనియేడ్చుజడజార
దానిచేబూనియంగదుడువీర రసముచేరావణునివద్ద జేర
అంతలోమగనికనియతిఘోర వాక్యములుబల్కకన్నీరు
జార॥యాశారదాకరుణానిధీ॥ ౧౫॥

నీవు॥ బ్రహ్మవంశమందునబుట్టినావు వేద వేదాంగము
లు చదివినావు సకలశాస్త్రములు పరికించినావు వీరసే
నాంగములనువిన్నావు పద్మభవునాత్మలోనిల్పినావు కో
టిలింగార్చనలు జేసినావు యఖిలధర్మముల నుతెఱిగి
నావు నైన గాని పాపము జేసినావు దేవతులనెల్ల బాధిం
చినావు యక్షగంధర్వులనువేచినావు గరుడకిన్నరాదు

లగొట్టినావు దిక్పతులనెల్లదెగగొట్టినావు మానిమార్గము
ల్మట్టేసినావు మర్త్యలోకంబుమాపేసినావు నాగలోక
మునునలిపేసినావు మూడులోకములునుంచేసినావు వీ
రసంపదలుహరియించినావు - వారికాంతలనుచెరదెచ్చి
నావు ఎల్లవారలనుయేడ్పించినావు వారివసురలనుమా
టగొన్నావు తుదకుసీతనొకతెనుదెచ్చినావు మృత్యుదేవ
తనుదెచ్చుకొన్నావు దాసిచేలంకమాపేసినావు॥ యాశా
గదాకరుణానిధీ॥ ౧౯౬॥

ఓయి॥ రాక్షసాంతకుడురాముడుగదోయి యీమెనత
నికిమ్మనిచెప్పితోయి ఎందరిల్లనుచెప్పిరోయి లక్ష్యపెట్టక
సువినవైతివోయి దైత్యదానవులుతలిరిగదోయి భృత్య
వర్గములు బోయిరిగదోయి మంత్రిశేఖరులుమడిగిరిగ
దోయి మిత్రసంఘములు మృతిబొందిరోయి కొండవం
టితమ్ముడుగూలెనో పుత్రులందరును బాలసిరిగదో
యి పిలువపేరులేకుండాయెనోయి పిడుగుపడియున్నయ
ట్లుతగిలెనోయి జీవరాసులేమాడాయెనోయి వాటిపా
పికాతడునొప్పదోయి పరులనేడిపించిన పాపమోయి
కట్టికుడిపినదికాసలేమోయి యింద్రజిత్తుపోయినపిమ్మటో
యి మొండికత్తియుండుట మోసమోయి హేమమం
త్రంబులికనేటికోయి యెవరుజూచి సంతోషింతురోయి
బ్రతుకుపైయాసయికగలదటోయి తెసుగనిశ్యంబసుచుద
లచకోయి॥ లంకకాసురాముల పలిరోయి నీవుదీక్షు
జేసినపిమ్మటోయి వీరులంకలాచారదరోయి చెప్పిన

లవిగాసివిజేసిరో యి నన్నుజడబట్టుకొనిలాగిరో యి క్రో
ధమునసీడ్చుకొనివచ్చిరో యి ప్రాణహాని కోర్చగవచ్చు
నో యి మానభంగమోర్చుట వశముటో యి అయ్యోయో
మెంతపనిబుట్టెనో యిఅసుములారేగానసు జూడగో యి
దీనదశవచ్చెనసుగావరో యి యనుచుమందో దరి ట్లాయె
నో యి॥ఓశారదాకరుణానిధీ॥ ౧౯౭

అంటే॥ వాడుమండో దరిసిబట్టెకంటె నూరుమహాట్లా
డకనుయూరకుంటె ఆజ్ఞాపెంపుమంబుడా జేయుచుంటె-
డానికంతలోపలనో చరుంటె పాదములపైని బడిమొత్తు
కంటె బాహులనుజూచితానె త్తుకుంటె కావవేయనుచు
నదిలేవకుంటె గోలుగో లుమనితానేడ్చుచుంటె తానుక
నువిచ్చి వానిగనుగొంటె వానికున్న ధైర్యమువదలకుం
టె నీవుమంటరంబున కేగుచుంటె నంతలోనదితానేగు
చుంటె నివుడువానరులనే గొట్టకుంటె మీసమాయెనే
మెగమన్నచుంటె నద్భుతంబుగతానేగుచుంటె కోటవె
లపలికితావెళ్ల గొట్టె॥ఓశారదాకరుణానిధీ॥ ౧౯౮॥

వాడు ॥ రావణాసురుడుబహుదుండగీడు వాడుమం
దిరంబునకేగినాడు కోటిలింగార్చనలుజేసినాడు మో
దముమిన్నునుముట్టాధిఙంచినాడు చీనిచీనాంబరముగట్టినా
డు లెక్కలేనిసొమ్ములుబెట్టినాడు నిలువుటద్దములనీడగ
న్నాడు తనలోనెతా తెలివొందినాడు శస్త్రములురథ
ముపైనుంచినాడు రథముదో లుమనుచుబల్కినాడు గు
ణారవములుతాజేసినాడు కేవ్వమనిపెద్దకే కార్చినాడు-

ధంధణ భేరిమ్రోయించినాడు మూలబలమంతదరిజేర్చినాడు యుద్ధసన్నద్ధుడై వచ్చినాడు॥ ఓ శారదా॥ ౧౯౯

అంచి॥ రామరావణులయుద్ధంబుమించి రావణాసురునికోపంబుమించి శస్త్రజాలములు రామవిభుముంచి రామచంద్రుండుచాలకోపించి తగినబాణంబులేప్రయోగించి దేని-చొప్పునను దానివారించి నూటయిరువై యొక్కమారుద్రుంచి మొలచుచుండె యెప్పటిరీతిమించి రామచంద్రుణ్ణిబాలవిసికించి నేమిసేతుననిమదివిచారించి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౨౦౦॥

ఉండు॥ కొట్టగానెశిరములుమొలుచుచుండు నద్భుతంబనుచు రామచంద్రుండు ఏమియిదియనివిచారింపుచుండు సమయంబులోనవిభీషణుండు- చెప్పెకుడిపక్కలోవలనె యుండు-మేలైనట్టియమృతంపుకుండు- చెప్పెరావణుని పిన్నతమ్ముండు- పావకాస్త్రమునేసెనప్పుడు- రావణుని శిరములుమొలువకుండు- చెంగద్రోసెనప్పుడురావణుండు-పక్కనెటుగాదీనవదనుండు॥ ఓ శారదాకరుణానిధీ॥

వాదు॥ సీతోటిసేయగవిధిలేదు-దైవమనితెలియకున్నాను గాను- లోకమాతసీతమ్మయనినాడు - మనముసెరుగుడును తేకవిధిలేదు-లేకపోతెమికేకాక రాము- మీచేతిలో జప్పచేసేదు-చచ్చితేగాని మోక్షంబులేదు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౨౦౨॥

వాసం॥ రామచంద్రుండుమెగదుఫ్వామీసం - మేలైనదశరథునిభ-వాసం-ఎంచుజన్మించితంత్రాన్నికోసం - వ

చ్చినాడరా నేనువనవాసం- రాక్షసులబట్టిబరిమార్చుకో
సం-జేసినావు రాయిట్టిబలుదోసం- బందుచేతనిటువలెనీ
కు మోసం- బవతరించితిని నేనునీకోసం- బోర్వలేవురా
యింకనాయాసం-బనుచు వేగశిరములుద్రుంచుకోసం- చ
నిరిలంకలగ్గలకేగ్గకోసం॥శ్రీ శారదాకరుణానిధీ॥౨౦౩॥

తూలె॥ రావణాసురునిశిరమట్టె తూలె- బెద్దకొండవలె
ధరణిపైగూలె- రాక్షసులుబో త్తిగాకలసినేలె-ధీరంబుచే
బీనుగులు తూలె-లంకలో శంఖనాదములుబోనెవ్వూచియు
న్న మోదుగవనముబోలె - రామచంద్రుండుయెంతదయ
మాలె- నను ముయేద్వదోణగిరివారి స్త్రీలె-జనకపుత్రికను
చెరదెచ్చుటేలె-రాఘవునితోటిశత్రుత్వమేలె- నిష్కార
ణంబునజచ్చుటేలె- రామచంద్రవిభునిందింపనేలె- యిం
కనేరుయీమార్గమేలె - యతడులేకున్నయీసౌమ్ము
లేలె- చీరలేలమేలైననగలేలె - యనుచువైపైనదోరతన
ములేలే- కొత్తగానైనవిధవలనుబోలె- నపుడుశోకించె
మండోదరాలె-నెలుగెత్తిగాహాయనిబోలె॥శ్రీ శారదా॥

మొరసె॥ దేవదుందుభులదివినుండిమొరసె-పుడమిపై
నబుష్పవానగురిసె- లంకపొంకమివేళతో మొరసె- రా
మచంద్రుండుకరుణతో మొరసె-బాయకున్నాడులక్ష్మణు
నిమొరసె-ప్రమోదమలరంగనతనినుఖమరిసె- సంతోషం
బుతోజాలమొరిసె॥శ్రీ శారదా కరుణానిధీ॥ ౨౦౪॥

అంచి॥ రామచంద్రుండుచాలమోదించి- పలికెనాడు
వానరులనరియించి-లంకలో స్త్రీలుయున్నారుమించి- వె

ల్లబోవ్యేరుసుమికావరించి- వెళ్లినారం బెబ్బాంపుచీరిం
చి-వ్రేసెదనటంచుయప్పుడు చాటించి- నాల్గుతట్లుపారాల
నుంపించి- తమబంట్లనందరెనిబిలుపించి- లంకదోరణము
లూనరగట్టించి-యప్పుడుమేల్ జయస్తంభమెత్తించి- గోపు
రంబులోకప్పుడేగుడెంచి- పచ్చరాయొకటిజూచిమోహిం
చి-భీమెంతపనియనియక్కడుంచి-విభీషణుని వేగపిలిపిం
చిసకలమైనట్టినగలుధరియించి - పట్టాభిషిక్తుణ్ణిగావించి-
రామకథసరులుపుడమిమన్నించి - యెన్నిదినములు నుసీవు
మన్నించి-రాజ్యముచేయుమనివిశేషించి-చిరంజీవిగమ్మ
నుచుదీవించి-సైనమూహించి భేరివేయించి॥ ఔ శారదా ॥

చూచే॥ భూపుత్రికనురాముండుజూచె- మోదమలరం
గడగ్గిరికిడాసె- దోచినట్లుగానేరములేవేసె - రామచం
ద్రుండుమదికెనుకజేసె - సనుమానముంచకయాడిప్రవేసె-
బుడమిసీతమ్మతలవేల్రవేసె - మంచిదనుకొనుచుమదినూ
హజేసె-నగ్నిహోత్రప్రవేశంబుజెసె- దేవదుందుభు
లుదివినుండిమ్రోసె - పుష్పవర్షంబుగురియంగజూచె-
రామచంద్రుకడగల్మషముబాసె- జానకినిచాలప్రియము
పుడుజెసె-వెళ్లుదామనుచుసైనంబుజెసె॥ ఔ శారదాక॥

కంబు॥ వేగలేగోయికపులసంఘంబు-లెండి వేగంబెగండి
సైనంబు-మనముబట్టినటువంటి కార్యంబులౌ- నట్టుగాజే
సెదైవంబు- ఇదియంతమీమూర్తివంతంబు-యసిపల్కె-
దివ్యజ్ఞానంబు-గల్గునాడుహనుమంతుమోదంబు- వేగపడ
బోయియేమిజాలంబు- మాతండ్రియాజ్ఞాపాలనంబు -

దునాల్గేండ్లు వనవాసంబు - ఆయెనయ్యారేపటిసుదినంబు
తోడనేపక్కామనమువేగంబు- వెళ్లుచామనియయోధ్యా
పురంబు॥ ఔ॥ శారదాకరుణాసిద్ధీ॥ ౨౦౮॥

అంచి॥ భరద్వాజాశ్రమమునకేతెంచి- రావణాసురుని
గొట్టుటెరిగించి-మునివరులెల్ల జాలమోదించి- యావేళ
ట్టైవిందుగానించి-యామరునాడు పయనమూహించి- పు
ష్పకంబెక్కి- వేగజమడెంచి-యపుడునందిగ్రామముబ్రవే
శించి-వేగభరతుండుయదురేగుడెంచి- యన్నకునుమ్రొక్కు
చును కౌగలించి-కొలువుకూటమునకపుడేగుడెంచి- కొం
తసేపక్కడనుముచ్చటించి- పయినమాయెనయోధ్యకును
మించి॥ ఔ॥ శారదాకరుణాసిద్ధీ॥ ౨౦౯॥

వారు॥ సీతరామలక్ష్మణులపుడువారు-పయినగూర్చుం
డిచనుడెంచినారు-వీరకాహాళులుబట్టేటివారు-గరుడగం
ధర్వకిన్నరులవారు-ఘోరమైనట్టిదైత్యసంహారు- మేరుధీ
రుడగునిగమసంచారు-రామచంద్రుండువీరాదివీరు-కో
టిమన్మథులసుందరాకారు- నైవచ్చుచున్నాడయ్యావీరు-
నీ పట్టణమువారుజూచేరు-యప్పటప్పటికివారిలోవారు,
పంతంబువైచుచున్నారు- మేలైనట్టిసుగుణంబువారు- ప
ట్టణమునకటువేంచేసినారు॥ ఔ॥ శారదాకరుణాసిద్ధీ॥

ధీరు ॥ బలుపైనట్టిమేడలెక్కారు - స్త్రీలుబలుకీర్తిజూ
చుచున్నారు - మేలుభళిరనీసాయగముతీరు-- బ్రహ్మాదు
లైననుయెన్నలేరు-యితనిఫలువరుసకుందములగేరు-బా
మలుశింగిణివిండ్లనగుతీరు - కన్నుగవయు జూడకేముద్దు

గారు- పద్మముల గేరుముఖముందుసౌరు- పొగడతరమా నె కెమ్మోవితీరు-పట్టినంతలో తేనియలూరు- మదనశంఖ మును కంఠంబుమీరు-బాహువులుతమ్మిదూండులను గేరు- పురుషసింహంబ నానడుముబోలు తొడలుయరటిస్తంభ మ్ములను గేరు - పాదములపిల్లతాబేళ్లతీరు-గోళ్లునక్షత్ర ములనట్టెమీరు- చూడగానవయవములతీరు- కోమలాంగుండుసుందరాకారు- మారునకమారుమితనిబల్ తీరు- పొగడుచున్నారువారిలోవారు - యిటువంటి పెనిమిటిగల్గువారు-లెక్క లేనినోములునోచినారు- యెంతభాగ్యవతిసీతమ్మగారు యనుచుస్త్రీలిట్లుబలుకుచున్నారు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౨౧౧

ఉల్లా॥ ఉల్లాసపట్నంబుస్త్రీలెల్ల- నాణిముత్యాలసోస లేజల్ల-పళ్ళెములతోడమరికొందరెల్లా-నివ్వాళులప్పుడు తేజరిల్ల-శ్రీరామచంద్రులకీర్తులెల్ల నెగడెననగభూమండలంబెల్ల - రాగిల్లెదీపములు వెలిగిల్ల-నంతకంతకును తాబ్రజ్వరిల్ల - జాలఁగనయోధ్యపట్టణంబెల్ల లక్ష్మీకళల చేతనునుప్పతిల్ల - భేరినాదములచేతఘూర్ణిల్ల- వీరకాహళులుమరి తేజరిల్ల॥ ఓ శారదాకరుణానిధీ॥ ౨౧౨

మేలు॥ యెటుజూచినామంచిగుర్రాలు- మేలైనపట్టువీలిజండాలు- కెంపులమరించినట్టిఛత్రాలు-వజ్రముల్ దాపుమేల్ చామరాలు - సొగసైనట్టియేన్గు మొత్తాలు-ముత్యాలుమేలయినయాందాలు - కుప్పతెప్పలై గ్రాలుముత్యాలు- సొగసైనముద్దల్లుతాళాలు- అప్సరసలైనగంధర్వస్త్రీలు-

జంఝుణకతాయంచు నాట్యాలు- ఖేచరైనగంధర్వగానా
లు-సారంగములుజనుకురంగాలు- శంకరాభరణములును
సర్పాలురికఁబొడుచుకొని వినుచు కణాఁణాలు - వినుచును
న్నాయిభళి మేలుమేలు - మంచి నెరవైనసాని మేళాలు-
శోభిల్లేటియప్పటివీలు- దేవేంద్రుని పట్టణముబోలు-ఇట్టు
లయోధ్యలోసంభ్రమాలు॥ఓ శారదాకరుణా॥ ౨౧౩

అంచి॥ రామలక్ష్మణులుబలుసంతసించి- యపుడువు
ణిగోపురమునకే తెంచి వారితల్లులపుడెమరేగుదెంచి-
కౌఁగలించుకొనగానెబోధించి- హస్తయుగ్మముల్ నుదు
టముకుఘించి-మ్రొక్కఁగాదల్లులపుడుదీవించి- యప్పుడా
నందబాష్పములుమించి-కైకసిగ్గుపడిముఖమట్టుదించి-తె
రిపిలేకుండగన్నీరునించి జూచిరామచంద్రుండుబోధించి
కొలువుకూటమునకపుడేగుదెంచి॥ఓ శారదాకరుణా॥
మోద॥ మోదమలరసింహాసనముమీద - రామచం
ద్రుండుగూర్చుండలేద- యర్ఘ్యములువిప్రులాశీర్వాద-
మియ్యరామలక్ష్మణులపుడు మోద - మందిరయ్యసింహా
సనముమీద రంగుగాఖంగుమనిశంఖునాద-వినుతిజేయు
చుండిరిచాలమోద॥ఓ శారదాకరుణానిధీ॥ ౨౧౪

ఉండు॥ కొలువుకూటమునరామచంద్రుండు-నరదా
స్లనుసఖదీర్చియుండు - విభ్రాంతిగానపుడు భరతుండు-వీ
రెప్పరనియుడుగరాముండు - చూడవోయియితడుఖాను
జుండు- సింహాసనుడు మేటివీరుండు-కిష్కింధకితఁడాధిప

త్యుండు-యని పేరు విను జాంబవంతుండు- నేరుపైనట్టిబు ద్ధిమంతుండు-అని పేరు వినవోయి నీలుండు - చౌపట్టి రాజ్యము లేలుచుండు- బాహుబలుఁడు మేలతిసాహసుండు- వాలిపుత్రుఁడీతండంగదుండు మేలైనట్టిసారవంతుండు- విశ్వకర్మపుత్రుండు యాతండు- నీలుడను పేరునగసాహసుండు-వార్ధిఁబంధించినాఁడు యీతండు- భీకరుండితఁడు వాయుపుత్రుండు- నేలైనట్టిచండప్రచండు- డీహనుమయ్యధైర్యవంతుండు- భరతుండు చాలవినుచుండు-రణశూరుఁడైనశరభుండు యతండు పనసుడు యితఁడు తారుండు- యనుచువినుపించె రామచంద్రుండు- చాలసంతోషమొందె భరతుండు॥ ఓ శారదాకరుణా॥ ౨౧౬

అన్న॥ శ్రీరామచంద్రమీకన్న- తెలిసియున్నవారులేరన్న ఘనసుగుణకీర్తిసంపన్న- మావల్ల నేరమేమన్న-నీ పాదాలు నేనమ్ముకున్న-యడిగనుక నాదివకవిన్న పముచిత్తగించవోయన్న పట్టాభిషిక్తుడవుగమ్మన్న- నామనవిట్లు చెల్లించుమన్న-మదమొప్పనీయాజ్ఞ నొప్పన్న- సంచరింతుమనిభరతుడిట్లన్న- మోదములరంగబలెక-రామన్న ఓ శారదాకరుణాసింధో ౨౧౭

లేమ॥ నాలోనీలోను భేదంబులేమ- నీవుమేలుకుంటె లేమలేమ- ఆమాట నామనసులోలేమపరుఁడు రాజ్యపాలనమట్లుగాదు తమ్ముడవు నీవుయిటుబలుకరామ-యెవరికిదియేమి శాశ్వతముగాదు- యీభాగ్యంబు నిత్యంబుగాదు లోభితనముమతిమదినుంచరాదు- వెళ్లితే వెంటయా

గాని రాదు-కీర్తియపకీర్తిమరివదలిపోదు-ప్రాణమటు వమరియేసురాదు - పగలుగాత్రియుదడబడిపోదు-విష్ణు మాయదెలియగవల్లగాదు-తత్వమాగరంబసత్యంబుగా దు॥ఓ శారదాకరుణానిధీ॥ ౨౧౫

అంచి॥అన్నమాటలకుజాలమోదించి- హస్తయుగ్మ ముల్ నుదుటముకుళించి -తానువందనంబపుడాచరించి- నామనవిపుడువేగచెల్లించి మనగురువులనువారిబిలిపిం చి-కావలయుసామాగ్రిజేయించి - నీకరుణనాపైనుంచి యెంచి గట్టిగాలెమ్మటనగనూహించి- రామచంద్రులప్పు డుసమ్మతించి- రాజులందరికికబురుపంపించి-బిలుపించ గావారేగుదెంచి - చుట్టుమండలముపాడుగునసుమించి- లెక్కలేనిడేరాలువేయించి - రాజ్యపుంగవులుచాలమో దించి-తగ్గవారలనువెంటబిలుపించి-మంత్రిశేఖరులువేగ జనుదెంచి రామునకువందనంబాచరిం -మీసెలవుచొప్పు ననేగుదెంచి- నారమనుచునప్పుడువిన్నవించి- నృపులప ట్టంబులోకిరప్పించిపట్టణంబపుడుశృంగారించి ॥ఓ శార

మేలు॥బంగారుపెండెలపల్లకీలు- యాణిముత్యాలు మేల్మంజరీలు - మేలైనజల్తారుపెక్యాలు- యయిదువిధ ములపట్టుపుట్టాలు- సకలమైనట్టిమణిభూషణాలు- యం దులోనున్నసరసతలపీలు-వెలయువారలకుచంద్రహారా లు- పొగడదగునెగంజాసింధురాలు - మీనాలపైహారిల లాటాలు-చూచిపరతెంచియొగ్గుమొత్తాలు-వన్నెలతమలై

యున్నగుఱ్ఱాలు - మేలైనట్టిబలుటంగణాలు- మనోవేగ
మహావాయువేగాలు- గలిగినటువంటివెల్లగుఱ్ఱాలు-నేరా
లైనబలుతుపాకీలు-యందులోనచకుముకివేయివేలు- గుం
డ్లుపరతెంచుపదియోజనాలు - నూరుగురుకాపురముజే
యజాలు. వీరులైనట్టిపండుబూరాలు వేయుపుట్లబియ్య
ముపట్టజాలు- యేనుగులుపైసబలుతమాషీలు - సూర్య
బింబంబునందుకోజాలు- సొగసైనట్టినీలిజండాలు పొగడ
తరమెబంట్రోతులావీలు - మేలైనట్టిపువ్వుటంగీలు-ము
త్యాలసరిజేసుగాపాలు-వీపునసువలువలుమేలుడాలు- ఖ
ట్వాంగఖేటకభిండివాలు. బత్తిసాయుధంబులుతోమరా
లు-ముద్గరముకుంతపరశుశూలాలు బంటోత్రులాత్యాగ్ర
పీడాలు- శోభిల్లేటిసాలపుటీవీలు- ఇటులయోధ్యలోసం
భ్రమాలు॥ ఓశారదాకణానిధీ॥ ౨౨౦

వారు ॥ అయోధ్యాపట్టణములోవారు- పురమెల్ల
శృంగారించినారు-ముత్యాలముగ్గులుబెట్టినారు- అపుడు
మేలైనయట్టిబంగారు పిగులుపళ్లెరంబులబోసినారు -
పూర్ణకుంభములుగాజేసినారు పారిజాతములుమంచిప
న్నీరు-మల్లెసంపంగియుత్తరేశేసు- జాజిచేమంతితావుల
నుమీరు-నందివర్ధనమ్ములుదెచ్చినారు- నెరవైనకుందనపు
బంగారు-వారుపళ్ళెరంబులబోసినారు-రామలక్ష్మణులు
భరతులనువారు- శత్రుఘ్నుడుమొదలైనవారు-రత్నంపు
పావాలుదొడిగేరు తగినదుప్పట్లుగప్పుకొన్నారు- మంచి
నగలెల్లధరియించినారు యాటపాటమునకేతెంచినారు

బంగారుపీటలు వేసినారు యందుమీదనుగూర్చున్నారు - వేదమంత్రులుగురువులగువారు- విఘ్నేశ్వరుని ప్రార్థించినారు- రామచంద్రులపూజించినారు-చూతపల్లవంబులుదెచ్చినారు పూర్ణకుంభములపైనిలిపినారు యుక్తమైనట్లుజరిపించినారు- యపుడు శ్రీరామచంద్రులవారు-అలరపట్టాభిషిక్తులయినారు సురులప్పుడుదివినుండివారు-దేవదుందుభుమొరసెనొకతీరు పుష్పవర్షంబుగురిపించినారు- రామచంద్రులప్పుడు మెచ్చినారు పల్లకీనెక్కి-యూరేగినారు- వర్ణించెననువినరయ్యామీరు॥ఓ శారదా॥

మేలు॥ చూచుటకుకన్నులకునుచోద్యాలు - మేలైన యలంకారములు- వారలనమించుయస్తుతారాలు ఝల్లరిస్లేటిబాణసంచారు- లాప్పుగులేక-టిబిరుమచిత్రాలు- ప్రజ్వరిల్లేటిఝుంజరిజాలు - వింతవింతలైనట్టిచిత్రాలు-వచ్చిసింహాసనమునపైవీలు- పట్టణంబులోనున్నట్టిస్త్రీలు నివాళిబంగరుపళ్లెరాలు- పట్టినారు శ్రీరాములపాదాలు గొలుచుచున్నారుబహువత్సరాలు- రామచంద్రులిండుపట్నంబేలు॥ఓ శారదాకరుణానిధీ॥ ౨౨

వారు॥ సుగ్రీవుండుమొదలైనవారు -రామచంద్రులెదటనువచ్చినారు- కోరుచున్నట్టికోరెలందేరు- హస్తయుగ్మముల్ జోడించినారు - మ్రొక్కిసెలవడిగివేగజని వారురామచంద్రులదీవించినారు-వారితావులకువారేగినారు- ఉన్నతావులకుసెలవిచ్చినారు-ధర్మమార్గమునపాలించుచుండిరు॥ఓ శారదాకరుణానిధీ॥ ౨౩

ఉండ॥ రామచంద్రుఁడుపాలింపుచుండ-తానుతమ్ము లందరుకొలుచుచుండ- ప్రజలీరీతితన్గొలుచుచుండ- నన్యాయముమరిచెప్పకుండ- న్యాయవర్తనలపాలింపుచుండ- తండ్రులుండసుతులుజావకుండ - పుత్రశోకమునుజెందనీయకుండ వెతికితేనొక్కవిధవలేకుండ నూరేళ్ళుఅయిదువతనమునిండ బదనకొండవేలయేండ్లునిండ రాజ్యమొనరించియేలుబ్రహ్మోండ- భాండములుకీర్తిభూమెల్లనిండ - రాముకథశాశ్వతంబుగనుయుండ - జ్వరతాపాగ్నిభీతిలేకుండ - ప్రజలెల్లకుఃఖంబెఱుగకుండ- నగ్నియపమృత్యుభయమొందకుండ -నిత్యకల్యాణమైనెగడియుండ - పురంబెల్లమోదమునలుఁగ చుండా - నన్నివేడుకలచెమించినిండా-బ్రహ్మక్షత్రవైశ్యాంఘ్రిభవులుండా - శ్రీవసిష్ఠుండుమదిమెచ్చుచుండా - దమ్ములానందమైగొలుచుచుండా-బ్రహ్మఋషులెల్లదీవించుచుండా - ధర్మదేవతయునుదముచేనిండా-నాల్గుపాదంబులనునడుచుచుండా సీతతోగూడియుప్పొంగుచుండ -ప్రచండముగగీర్తిభువినిండా-నెలమూడువానలుగురియుచుండా- నవధాన్యముఫలియింపుచుండా - తనరాజ్యమునకరువులేకుండా-పాడిపంటలనువర్ధిల్లుచుండా-యాచంద్రతారకముగానుండా రాముడిలయేలెబంగారుకొండా॥ఓ శారదాకరుణాసిద్ధి

అంబు ॥ శ్రీరామచంద్రునిచరితంబు - వాల్మీకిరామాయణంబు కథాసారముగ[illegible]ర్చిబలుడంబు- గులుకగా మంచిమృదువగుపదంబు-తేర్చికూర్చితిని శారదపదంబు-

లమరుశారదరామాయణంబు-దీనిచదివివినివ్రాయుష
సంబు-లఖిలభోగభాగ్యంబులతిరంబు గాగననుభవంబు
దియంతంబు-నందుజెందుదురామునిపదంబు -రామ
క్తకవిచెప్పెకథనంబు-వినవినగవేడుకగమధురంబు-లీమ
నట్టిదీరామాయణంబు-రామచంద్రునకెయిదియంకితం
బు-లోకములకెల్లముక్తిప్రదంబు-ధాత్రినాచంద్రతార
కారకంబు-గాగనుండునీరామాయణంబు॥ ఓ శారదా
కరుణానిధీ॥ ౨౨౫

శ్రీ శారదరామాయణము-ముగిసెను.

